మోహన్ పబ్లికేషన్స్ వారి

# శ్రీలలితా-విష్ణు సహస్రనామస్తోత్రాలు

శ్రీరామరక్షా,నవదేవీ,శివస్తోత్రములు,శతగాయత్రీమంత్రములతో...



నవదేవీ అష్టోత్తర శతనామావళులతో,అత్యధిక స్తోత్రాదులతో తెలుగు, హిందీ,ఇంగ్లీషు భాషలలో వెలువడిన మొట్టమొదటిగ్రంథం

# మణిద్వీపవర్ణన



# మహా సంపదలిచ్చు శ్రీమణిద్వీపేశ్వరీ అష్టోత్తర శతనామావళి

ప్రతినామమునకు ముందు "ఓం" అనియు చివర "నమః" అనియు చెప్పవలెను.

ఓం దివ్యలోకవాసిన్యై నమః
సర్వలోక సంరక్షకాయై
సర్వమృత్యుసర్వాపద్వినివారణ్యై
లలితాబాలా,దుర్గాశ్యామలాకృత్యై
గంగా,భవానీ గాయత్రీస్వరూపాయై
లక్ష్మీ, పార్వతీ, సరస్వతీ,స్వరూపాయై విభవాయై
రాజరాజేశ్వరీదేవ్యై
భక్తాభీష్టదాయిన్యై
భక్తిభుక్తిముక్తిప్రదాయిన్యై
భక్తసంకల్పసిద్ధిదాయై
పృధ్వీశ్వరీదేవ్యై
ఆధివ్యాధినివారిణ్యై
దౌర్భాగ్యనివారిణ్యై





సౌభాగ్యదాయిన్యై
సృష్టిస్థితిలయాయై
అష్టసిద్ధి నవనిధిప్రదాయిన్యై
అష్టదికాల్పక వందితాయై
త్రికాల వేదిన్యై
షడ్గుణ సంసేవితాయై
షడ్రుతు పరివేష్టితాయై
నవగ్రహవిధివిధానాధిష్టానాయై
సత్యధర్మశాంతిప్రేమప్రసాదిన్యై
సర్వకాలసర్వావస్థా సమస్థితాయై
అనంతసాగర, నదీనదాకృత్యై
కాంస్య(కంచు) లోహమయప్రాకారిణ్యై
పీత (ఇత్తడి) లోహమయ ప్రాకారిణ్యై
తామ్ర(రాగి) లోహమయప్రాకారిణ్యై
సీసలోహమయ ప్రాకారిణ్యై
పంచలోహమయప్రాకారిణ్యై



రజతసాలప్రాకారిణ్యై
సువర్ణసాల ప్రాకారిణ్యై
పుష్యరాగమణిమయప్రాకారిణ్యై
పద్మరాగమయ ప్రాకారిణ్యై
గోమేధికమణిమయప్రాకారిణ్యై
వజ్రమయ ప్రాకారిణ్యై
వైడూర్యమయప్రాకారిణ్యై
ఇంద్రనీలమణిమయప్రాకారిణ్యై
మరకతసాలమయ ప్రాకారిణ్యై
ప్రవాళసాలమయ ప్రాకారిణ్యై
రత్నసాలమయప్రాకారిణ్యై
చింతామణిమయప్రాకారిణ్యై
శృంగారమండప దేవదేవతాయై
జ్ఞానమండప జ్ఞానేశ్వరీదేవ్యై
ఏకాంతమండప ముక్తీశ్వరీదేవ్యై
ముక్తిమండప ముక్తేశ్వరీదేవ్యై





కాశ్మీరవన కామాక్షీదేవ్యై
మల్లికావన కౌమారీదేవ్యై
కుందవన కౌమారీదేవ్యై
కస్తూరీవనకామేశ్వరీ దేవ్యై
సాలోక్యముక్తి ప్రసాదిన్యై
సారూప్యముక్తిప్రదాయిన్యై
సామీప్యముక్తిదాయిన్యై
సాయుజ్యముక్తిప్రసాదిన్యై
ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తిరూపిణ్యై
పరాంకుశపాశాభయహస్తాయై
సహస్రకోటిసహస్రవదనాయై
ముకుందామృతాంబుధయే
సహస్రకోటిసహస్రచంద్ర సమసుధానేత్రాయై
సహస్రకోటి సహస్ర సూర్యసమాభాసాయై
జరామరణరహితాయై
నారదతుంబుర సకలమునిగణవందితాయై



పంచభూతయజమానస్వరూపిణ్యై
జన్మజన్మాంతరదుఃఖభంజనాయై
లోకరక్షాకృత్యతత్పరాయై
బ్రహ్మావిష్ణు మహేశ్వర కోటివందితాయై
చతుష్షష్టికళాసంపూర్ణస్వరూపిణ్యై
షోడశకళాశక్తిసేనాసమన్వితాయై
సప్తకోటి మనుమంత్ర విద్యాలయాయై
మదన విఘ్నేశ్వర కుమారమాతృకాయై
కుంకుమశోభితదివ్యవదనాయై
అనంతనక్షత్రగణనాయికాయై
చతుర్దశభువనకల్పనాయై
సురాధినాథ సత్సంగ సమాచారకార్యకలాపాయై
అనంగరూపపరిచారికాసేవితాయై
గంధర్వ యక్షకిన్నర కింపురుషవందితాయై
సంతాన కల్పవృక్షసముదాయ వాసిన్యై
అనంతకోటి బ్రహ్మాండ సైనికాధ్యక్ష సేవితాయై



పారిజాత, కదంబవనవిహారిణ్యై
సమస్తదేవీ కుటుంబవందితాయై
చతుర్విదకళాధారిణ్యై
బ్రాహ్మీమహేశ్వరీ వైష్ణవీవారాహీ వందితాయై
చాముండీ మహాలక్ష్మీఇంద్రాణీపరిపూజితాయై
షట్కోణయంత్రప్రకారిన్యై
సమస్తపతివ్రతాసంసేవితాయై
సహస్రస్తంభ మండపవిహారిణ్యై
నాదబిందుకళాతీతశ్రీచక్రవాసిన్యై
పాపతాప దారిద్ర్యనాశిన్యై
శ్రుతి,స్మృతి,పురాణకావ్యసంరక్షణాయై
పంచబ్రహ్మాసన విరాజితాయై
వజ్రవైడూర్యమరకత మాణిక్యచంద్రకాంత,
-రత్నసింహాసన శోభితాయై
దివ్యాంబర ప్రభాదివ్యతేజోవిభాసాయై
పంచముఖ సర్వేశ్వర హృదయాధిష్టానాయై

ఆపాదమస్తక నవరత్నసువర్ణాభరణధారిణ్యై
విలాసినీ అఘోరా మంగళాసనా పీఠశక్తివందితాయై
క్షమా,దయా,జయా,విజయాపీఠశక్తి పరిపాలికాయై
అతీత,అపరాజితా,నిత్యపీఠశక్తిపరిపూజితాయై
సిద్ధి,బుద్ధి,వేదా, లక్ష్మీ,శృతిపీఠశక్తి సేవితాయై
లజ్జాతుష్టిపుష్టి పీఠశక్తి ప్రభాసితాయై
నవరాత్రి దీక్షాప్రియాయై
నామ,గాన,జ్ఞానయజ్ఞప్రియాయై
జపతపోయోగత్యాగసంతుష్టాయై
పంచదశీమహావిద్యాయై
సదాషోడశప్రాయసర్వేశ్వర వల్లభాయై
ఓంకారాక్షర స్వరూపిణ్యై
సకలయంత్ర సకలతంత్ర సమార్చితాయై
సహస్ర యోజన ప్రమాణ, చింతామణీగృహవాసిన్యై
మహాదేవసహితశ్రీపరమేశ్వరీదేవ్యై
మణిద్వీపవిరాజిత మహాభువనేశ్వరీదేవ్యై



## మహాసంపదలిచ్చు - **మణిద్వీప వర్ణన**

1. మహాశక్తి మణిద్వీప నివాసిని
ముల్లోకాలకు మూల ప్రకాశిని
మణిద్వీపములో మంత్రరూపిణి
మన మనస్సులలో కొలువైయుంది

2. సుగంధ పరిమళ పుష్పాలెన్నో వేలు
అనంత సుందర సువర్ణపూలు
అచంచలంబుగు మనో సుఖాలు
మణి ద్వీపానికి మహానిధులు

3. లక్షల లక్షల లావణ్యాలు
అక్షర లక్షల వాక్ సంపదలు
లక్షల లక్షల లక్ష్మీపతులు
మణి ద్వీపానికి మహానిధులు

4. పారిజాత వన సౌగంధాలు
సురాధినాధుల సత్సంగాలు

గంధర్వాదుల గాన స్వరాలు
మణి ద్వీపానికి మహానిధులు
భువనేశ్వరీ సంకల్పమేజనియించే మణిద్వీపం
దేవదేవుల నివాసము అదియే కైవల్యం

5. పద్మరాగములు సువర్ణమణులు
పది ఆమడల పొడవునగలవు
మధురమధురమగు చందనసుధలు
మణిద్వీపానికి మహానిధులు

6. అరువది నాలుగు కళామతల్లులు
వరాలనొసగే పదారుశక్తులు
పరివారముతో పంచబ్రహ్మలు
మణిద్వీపానికి మహానిధులు

7. అష్టసిద్ధులు నవనవ నిధులు
అష్టదిక్కులూ దిక్పాలకులు
సృష్టికర్తలు సురలోకాలు
మణిద్వీపానికి మహానిధులు



8. కోటిసూర్యులుప్రచండకాంతులు
కోటిచంద్రులచల్లనివెలుగులు
కోటితారకల వెలుగుజిలుగులు
మణిద్వీపానికి మహానిధులు

9. కంచుగోడల ప్రాకారాలు
రాగిగోడల చతురస్రాలు
ఏడామడల రత్నరాసులు
మణిద్వీపానికి మహానిధులు

10. పంచామృతమయ సరోవరాలు
పంచలోహమయప్రాకారాలు
ప్రపంచమేలే ప్రజాధిపతులు
మణిద్వీపానికి మహానిధులు

11. ఇంద్రనీలమణి ఆభరణాలు
వజ్రపుకోటలు వైఢూర్యాలు
పుష్యరాగమణిప్రాకారాలు
మణిద్వీపానికి మహానిధులు

12. సప్తకోటి ఘన మంత్రవిద్యలు
సర్వశుభప్రద ఇచ్ఛాశక్తులు
శ్రీగాయత్రీ జ్ఞానశక్తులు
మణిద్వీపానికి మహానిధులు ॥భవ॥
13. మిలమిలలాడే ముత్యపురాసులు
తళతళలాడే చంద్రకాంతములు
విద్యుల్లతలు మరకతమణులు
మణిద్వీపానికి మహానిధులు
14. కుబేర ఇంద్రవరుణదేవులు
శుభాలనొసగే అగ్నివాయువులు
భూమిగణపతి పరివారములు
మణిద్వీపానికి మహానిధులు
15. భక్తిజ్ఞాన వైరాగ్యసిద్ధులు
పంచభూతములు పంచశక్తులు
సప్తఋషులు నవగ్రహాలు
మణిద్వీపానికి మహానిధులు



16. కస్తూరి మల్లిక కుందవనాలు
సూర్యకాంతి శిలమహాగ్రహాలు
ఆరు ఋతువులు చతుర్వేదాలు
మణిద్వీపానికి మహానిధులు
17. మంత్రిణి దండిని శక్తిసేనలు
కాళి కరాళి, సేనాపతులు
ముప్పది రెండు మహాశక్తులు
మణిద్వీపానికి మహానిధులు
18. సువర్ణరజిత సుందరగిరులు
అనంతదేవి పరిచారికలు
గోమేధికమణి నిర్మితగుహాలు
మణిద్వీపానికి మహానిధులు
19. సప్తసముద్రములనంత నిధులు
యక్షకిన్నెర కింపురుషాదులు
నానాజగములు నదీనదములు
మణిద్వీపానికి మహానిధులు

20. మానవ మాధవ దేవగణములు
కామధేనువు కల్పతరువులు
సృష్టిస్థితిలయాకారణమూర్తులు
మణిద్వీపానికి మహానిధులు
21. కోటి ప్రకృతుల సౌందర్యాలు
సకలవేదములు ఉపనిషత్తులు
పదారు రేకుల పద్మశక్తులు
మణిద్వీపానికి మహానిధులు
22. దివ్య ఫలములు దివ్యాస్త్రములు
దివ్య పురుషులు ధీరమాతలు
దివ్యజగములు దివ్యశక్తులు
మణిద్వీపానికి మహానిధులు
23. శ్రీ విఘ్నేశ్వర కుమారస్వాములు
జ్ఞానముక్తి ఏకాంతభవనములు
మణినిర్మితమగు మండపాలు
మణిద్వీపానికి మహానిధులు



24. పంచభూతములు యాజమాన్యాలు
ప్రవాళసాలం అనేక శక్తులు
సంతాన వృక్షసముదాయాలు
మణిద్వీపానికి మహానిధులు
25. చింతామణులు నవరత్నాలు
నూరామడల వజ్రరాసులు
వసంతవనములు గరుడపచ్చలు
మణిద్వీపానికి మహానిధులు
26. దుఃఖము తెలియని దేవీ సేనలు
నటనాట్యాలు సంగీతాలు
ధనకనకాలు పురుషార్థాలు
మణిద్వీపానికి మహానిధులు
27. పదనాల్గు లోకాలన్నిటిపైన
సర్వలోకమను లోకము గలదు
సర్వలోకమే ఈ మణిద్వీపము
సర్వేశ్వరికది శాశ్వతస్థానం

28. చింతామణుల మందిరమందు
పంచబ్రహ్మల పంచముపైన
మహాదేవుడు భువనేశ్వరితో
నివసిస్తాడు మణిద్వీపములో
29. మణిగణ ఖచిత ఆభరణాలు
చింతామణి పరమేశ్వరి దాల్చి
సౌందర్యానికి సౌందర్యముగా
అగుపడుతుంది మణిద్వీపములో
30. పరదేవతను నిత్యము కొలిచి
మనసర్పించి అర్చించినచో
అపారధనము సంపదలిచ్చి
మణిద్వీపేశ్వరి దీవిస్తుంది ॥2॥
31. నూతన గృహములు కట్టినవారు
మణిద్వీప వర్ణన తొమ్మిదిసార్లు
చదివిన చాలు అంతా శుభమే
అష్టసంపదల తులతూగేరు॥2॥



32. శివకవితేశ్వరి శ్రీ చక్రేశ్వరి
మణిద్వీపవర్ణన చదివిన చోట
తిష్టవేసుకొని కూర్చొనునంటా
కోటి శుభాలనుసమకూర్చుకొనుటకై
భువనేశ్వరి సంకల్పమే జనియించే మణిద్వీపం
దేవదేవుల నివాసము అదియే కైవల్యం ॥భు॥

ఫలశృతి : పదునాలుగు లోకాలకూ పరంజ్యోతి యగు మణిద్వీప నివాసిని, పరమేశ్వరిని, తొమ్మిది విధాలుగా కీర్తించుకొనుటకు తొమ్మిదిదోహాలతో ఈ స్తోత్రం వ్రాయ బడింది. అమ్మకు నవసంఖ్య ఇష్టంగాబట్టి దీనిని తొమ్మిది పర్యాయములు ప్రతిరోజు చదివిన ప్రతిమనిషి తరించవచ్చు. దీనిని శుక్రవారమునాడు పూజావిధాన ప్రకారము పూజించి తొమ్మిదిమార్లు పారాయణ లేదా గానంచేసిన ధన,కనక,వస్తు, వాహ నాది సంపదలుకలిగి భక్తి, జ్ఞాన, వైరాగ్య, సిద్ధులతో ఆయురారోగ్య, ఐశ్వర్యాలతో తులతూగి, చివరకు మణి ద్వీపం చేరగలరు. గృహప్రవేశ సమయంలో పారాయణచేస్తే భూత,ప్రేత పిశాచాది దుష్టగ్రహాలన్ని పారిపోతాయి,జయం లభిస్తుంది, ఇంతటి మహోత్తమ విషయలెందులోనూలేవు. ఇది శాస్త్రవాక్యం.

## మణిద్వీప స్తోత్రమ్

పదునాలుగులోకాలకూనిధియే మణిద్వీపం...
మణిద్వీపానికిధీటుగామరి ఏలోకంలేదూ
ఓం శివేశివేశి ఓం మహామహేశి ॥2॥ 1

మణిద్వీపానికి మాతగా పరమేశ్వరిదేవి...
మణులూరత్నపురాశులతులతూగుతూవుంది॥2॥2

మణిద్వీపానికి సేనలు మహాశక్తులెన్నో
చింతామణిగృహసీమ కోటిసూర్యవెలుగు॥2॥ 3

మణిద్వీపానికి శోభగాసుందరవన, గంధాలూ
చింతామణి గృహసీమ ఇంద్రనీమణివీధులు
లోకాలకే వెలుగూ ॥ఓం॥2॥ 4

మణిద్వీపమును నిత్యము పూజించెడివారూ...
బ్రహ్మాండాలకు నాధులువారే త్రిమూర్తులు॥ఓం॥2॥5

మణిద్వీపానికి కాంతులు...సూర్యచంద్రతారకలూ...
లక్ష్మీపార్వతి సరస్వతులువారేత్రిజ్యోతులూ॥ఓం॥2॥6



మణిద్వీపేశ్వరి భావనే మహాసౌభాగ్యం
మణిద్వీపానికి సౌందర్యం గంధర్వకళాగానాలు॥ఓం॥

పద్మరాగమణి ఊయలపై ఊగే శ్రీమాతా
మణిద్వీపానికిఅధిపతియైనదుపును జగములనూ॥

మణిద్వీపానికి జీవము భువనేశ్వరీదేవీ
మణిద్వీపాన్ని ప్రేమతో కొలిచెను శివకవిత॥ఓం॥2

---

## లలితా గాయత్రి

లలితాదేవ్యైచ విద్మహే కామేశ్వర్యై చ
ధీమహి తన్నో దేవీ ప్రచోదయాత్ ॥

---

## శ్రీ మణిద్వీపేశ్వరీ గాయత్రి

శ్రీ మణిదీపేశ్వర్యైచ విద్మహే
శ్రీ చక్రేశ్వర్యై చ ధీమహి
తన్నోదేవీ ప్రచోదయాత్ ॥

# శ్రీ లలితా చాలీసా

1. లలితామాతాశంభుప్రియా జగతికిమూలం నీవమ్మా
శ్రీ భువనేశ్వరి అవతారం జగమంతటికీ ఆధారం
2. హేరంబునికి మాతవుగా హరిహరాదులు సేవింప
చండునిముండుని సంహారం చాముండేశ్వరి అవతారం
3. పద్మరేకుల కాంతులలో బాలాత్రిపురసుందరిగా
హంసవాహనారూపిణిగా వేదమాతవైవచ్చితివి
4. శ్వేత వస్త్రముధరియించి అక్షరమాలను పట్టుకొని
భక్తిమార్గము చూపితివి జ్ఞానజ్యోతిని నింపితివి
5. నిత్య అన్నాదానేశ్వరిగా కాశీపురమున కొలువుండ
ఆదిభిక్షువై వచ్చాడు సాక్షాదాపరమేశ్వరుడు
6. కదంబవన సంచారిణిగా కామేశ్వరుని కళత్రముగా
కామితార్థప్రదాయనిగా కంచికామాక్షివైనావు
7. శ్రీచక్రరాజనిలయనిగా శ్రీమత్ త్రిపురసుందరిగా
సిరిసంపదలు ఇవ్వమ్మా శ్రీమహలక్ష్మిగ రావమ్మా
8. మణిద్వీపమున కొలువుండి మహాకాళి అవతారములో
మహిషాసురుని చంపితివి ముల్లోకాలను ఏలితివి



9. పసిడి వెన్నెల కాంతులతో పట్టువస్త్రపుధారణలో
పారిజాతపు మాలలో పార్వతిదేవిగ వచ్చితివి
10. రక్తవస్త్రపు ధరయించి రణరంగమున ప్రవేశించి
రక్తబీజుని హతమార్చి రమ్యకపర్ధినివైనావు
11. కార్తికేయునికి మాతవుగా కాత్యాయనిగా కరుణించి
కలియుగమంతా కాపాడి కనకదుర్గవై వెలసితివి
12. రామలింగేశ్వరుని రాణివిగా రవికులసోముని రమణివిగా
రమావాణీ సేవితగా రాజరాజేశ్వరివైనావు
13. ఖడ్గం, శూలం ధరియించి పాశుపతాస్త్రము చేబూని
శంభు నిశుంభుల దునుమాడి వచ్చింది శ్రీశ్యామలగా
14. మహామంత్రాధి దేవతగా లలితాత్రిపురసుందరిగా
దారిద్ర్య బాధలు తొలగించి మహదానందము కలిగించి
15. ఆర్తత్రాణపరాయణివే అద్వైతామృతవర్షిణివే
ఆదిశంకరపూజితవే అపర్ణాదేవి రావమ్మా
16. విష్ణుపాదమున జనియించి గంగావతారము ఎత్తితివి
భాగీరథుడు నిను కొలువ భూలోకానికి వచ్చితివి॥ల॥

17. ఆశుతోషునిమెప్పించి అర్ధశరీరం దాల్చితివి
ఆది ప్రకృతి రూపిణిగా దర్శనమిచ్చెను జగదంబ

18. దక్షుని ఇంట జనియించి సతీదేవిగా చాలించి
అష్టాదశ పీఠేశ్వరిగా దర్శనమిచ్చెను జగదంబ

19. శంఖుచక్రములు ధరియించి రాక్షస సంహారముచేసి
లోకరక్షణ చేసావు భక్తులమదిలో నిలిచావు

20. పరాభట్టారిక దేవతగా పరమశాంత స్వరూపిణిగా
చిరునవ్వులను చిందిస్తూ చెరుకుగడను ధరయించితివి

21. పంచదశాక్షరి మంత్రారాధితగా పరమేశ్వర పరమేశ్వరితో
ప్రమధగణములు కొలువుండ కైలాసంబే పులకించే

22. సురలు అసురులు అందరును శిరసును వంచి మ్రొక్కంగా
మాణిక్యాలకాంతులతో నీ పాదములు మెరిసినవి

23. మూలాధారచక్రములో యోగినులకు ఆధీశ్వరియై
అంకుశాయుధధారిణిగా భాసిల్లెను శ్రీ జగదంబ

24. సర్వదేవతల శక్తులచే సత్యస్వరూపిణి రూపొంది
శంఖనాదము చేసితివి సింహవాహినిగ వచ్చితివి॥ల॥



25. మహామేరువు నిలయనివి మందార కుసుమమాలలతో
మునులందరు నిను కొలవంగా మోక్షమార్గము చూపితివి

26. చిదంబరేశ్వరి నీ లీల చిద్విలాసమే నీ సృష్టి
చిద్రూపీ పరదేవతగా చిరునవ్వులను చిందించె

27. అంబా శాంభవి అవతారం అమృతపానం నీ నామం
అద్భుతమైనది నీ మహిమ అతిసుందరము నీ రూపం

28. అమ్మలగన్న అమ్మవుగా ముగ్గురమ్మలకు మూలముగా
జ్ఞానప్రసూనా రావమ్మా జ్ఞానము నందరికివ్వమ్మా

29. నిష్టతో నిన్నే కొలచెదము నీ పూజలనే చేసెదము
కష్టములన్నీ కడతేర్చి కనికరముతో మము కాపాడు

30. రాక్షస బాధలు పడలేక దేవతలంతా ప్రార్థింప
అభయహస్తము చూపితివి అవతారములు దాల్చితివి

31. అరుణారుణపు కాంతులలో అగ్నివర్ణపు జ్వాలలో
అసురులనందరను దునుమాడి అపరాజితవై వచ్చితివి

32. గిరిరాజునికు పుత్రికగా నందనందుని సోదరిగా
భూలోకానికి వచ్చితివి భక్తులకోర్కెలు తీర్చితివి॥ల॥

33. పరమేశ్వరునికి ప్రియసతిగా జగమంతటికి మాతవుగా
అందిరి సేవలు అందుకొని అంతట నీవే నిండితివి

34. కరుణించమ్మా లలితమ్మా కాపాడమ్మా దుర్గమ్మా
దరిశనమియ్యగ రావమ్మా భక్తుల కష్టం తీర్చమ్మా

35. ఏ విధముగ నిను కొలిచినను ఏ పేరున నిను పిలచినను
మాతృహృదయవై దయచూపు కరుణామూర్తిగ కాపాడు

36. మల్లెలు మొల్లలు తెచ్చితిమి మనసు నీకే ఇచ్చితిమి
మగువలమంతా చేరితిమి నీ పారాయణ చేసితిమి

37. త్రిమాతృరూపా లలితమ్మా సృష్టి స్థితి లయకారిణివి
నీ నామములు ఎన్నెన్నో లెక్కించుట మా తరమవునా

38. ఆశ్రితులందరురారండి అమ్మరూపము చూడండి
అమ్మకు నీరాజనమిచ్చి అమ్మ దీవెన పొందుదము

39. సదాచార సంపన్నవుగా సామగాన ప్రియలోలినివి
సదాశివ కుటుంబినివి సౌభాగ్యమిచ్చే దేవతవు

40. మంగళగౌరీ రూపమును మనసుల నిండా నింపండి
మహాదేవికి మనమంతా మంగళ హారతులిద్దాము ॥ల॥



## నిత్యపారాయణ శ్లోకం

అన్నపూర్ణే సదాపూర్ణే-శంకర ప్రాణవల్లభే
జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం-భిక్షాందేహి చ పార్వతి॥

## శాంతి శ్లోకాలు

నీ పాదకమల సేవయు నీపాదార్చకులితోటినెయ్యము
నితాంతాపారభూతదయయును
తాసనమందారమాకు దయ సేయగదే
ఓం సతోమాసద్గమయ ఓం మృత్యోర్మాఅమృతంగమయ

ఓం శాంతిః శాంతి శాంతిః
హరిః ఓం తత్ సత్...

## నిద్రలేవగానే

సముద్ర వసనే దేవి పర్వతస్తనమండలే
విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శక్షమస్వమే
కరాగ్రేవసతే లక్ష్మీ కరమధ్యే సరస్వతీ
కరమూలేస్థితాగౌరీ ప్రభాతే కరదర్శనమ్॥

# ఉయ్యాలలూగువేళ...

రాగం : యమునా కళ్యాణి

పల్లవి : ఉయ్యాలలూగువేళలోన బాలత్రిపురకూ
వయ్యారమొలుకుపూలశ్వాస
వీచె హాయిగా....ఆ...ఆ...ఆ...ఆ...
కలహంసలు కదలినటుల ఊయలూపితే
నిదురించుచు తనువు మరచి ఆదిదేవత
చిరుఅలకిడైన శబ్దమైన చేయబోకుమా ॥ఉ

చ2) : పద్మరాగమణిరాశుల వెలుగులితకు
వజ్రాలతో రతనాలతో తూగుత్రిపురకు
పవళించు వేళమౌనముగా
సేవజేయుమా ॥ఉ

చ3) : రజతాచలసింహాసిని రత్నగిరులను
శివకవితాభావాలతో తలచుకొందుమా
మన జీవితాలు భాగ్యవంతమగును
సత్యమూ ॥ఉ



# నవగ్రహ స్తోత్రములు

ఆదిత్యాయచ సోమాయమంగళాయబుధాయచ
గురుశుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః॥
జపాకుసుమ సంకాశం కాశ్యపేయం మహాద్యుతిమ్
తమోరిం సర్వపాపఘ్నం ప్రణతోస్మిదివాకరమ్॥
దధిశంఖ తుషారాభం క్షీరోదార్ణవ సంభవమ్
నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణం॥
ధరణీగర్భసంభూతం విద్యుత్కాంతి సమప్రభమ్
కుమారం శక్తిహస్తం తం మంగళం ప్రణమామ్యహం॥
ప్రియంగుకలికాశ్యామాం రూపేణ ప్రతిమం బుధం
సౌమ్యం సత్వగుణోపేతం తం బుధం ప్రణమామ్యహం॥
దేవానంచ ఋషీణాంచ గురుంకాంచన సన్నిభం
బుద్ధిమంతం త్రిలోకేశం తం నమామి బృహస్పతిం॥
హిమకుంద మృణాళాభం దైత్యానాం పరమం గురుం
సర్వశాస్త్ర ప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహం॥
నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజం
ఛాయామార్తాండ సంభూతం తం నమామి శనైశ్చరం॥

అర్ధకాయం మహావీరం చంద్రాదిత్య విమర్ధనం
సింహికాగర్భ సంభూతం తం రాహుం ప్రణమామ్యహం
ఫలాశపుష్ప సంకాశం తారకాగ్రహ మస్తకం
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం తం కేతం ప్రణమామ్యహం॥

## యజ్ఞోపవీత మంత్రము

(జంధ్యం ధరించినపుడు పఠించవలసిన మంత్రము)
ఓం యజ్ఞోపవీతం పరమం పవిత్రం
ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్ । ఆయుష్యమగ్ర్యం
ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః॥

## యజ్ఞోపవీత విసర్జన మంత్రము

(జంధ్యం తీసినపుడు పఠించవలసిన మంత్రము)
ఓం ఉపవీతం భిన్నతంతుం జీర్ణం కశ్మలదూషితమ్ ।
విసృజామి పునర్బ్రహ్మన్వర్చో దీర్ఘాయురస్తుమే ॥

## దీప ప్రార్థన

దీపజ్యోతిః పరంబ్రహ్మ దీపం సర్వతమోపహం ।
దీపేన సాధ్యతే సర్వం సంధ్యా దీప నమోస్తుతే ॥



## గాయత్రీ మంత్రము

ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య
ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ ॥

పవిత్రమైన ఈ మంత్రమును గురువు నుండి స్వరయుక్తముగా నేర్చుకొని కదు శ్రద్ధతో పఠించవలెను. ఈ మంత్రమును 108 పర్యాయములు జపించిన కార్య సిద్ధి కలుగును. అది సాధ్యముకానివారు 24పర్యాయ ములు పఠించవలెను. ఎట్టిపరిస్థితిలోనూ ఉచ్చారణా దోషములు లేకుండ చూచుకొని చదువవలెను.

## మృత్యుంజయ మహామంత్రము

ఓం త్ర్యంబకరం యజామహే । సుగంధింపుష్టివర్ధనమ్।
ఉర్వారుకమివబంధనాత్ । మృత్యోర్ముక్షీయమామృతాత్॥

పరమశివుని ప్రార్థించుచున్నాము. బాగుగా పెరిగి, పరిపక్వమునొంది, సువాసనలు వెదజల్లు దోసపండు బందమును త్రెంచుకున్నట్లుగా మృత్యువుయొక్క బంధన ములనుండి మమ్ములను విముక్తులను చేయుము. అమృతత్వము నుండి అమరత్వము నుండి దూరుము చేయవలదు.

## శివమంత్రం

ఓం హ్రీం శ్రీం శివాయ నమః

## భోజనమునకు ముందు

బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా
అహం వైశ్వానరోభూత్వాప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥

## పరుండునపుడు

రామం స్కందంహనూమంతం వైనతేయం వృకోదరమ్
శయనే యః స్మరేన్నిత్యం దుఃస్వప్నం తస్య నశ్యతి॥
ధ్యానమూలం గురోర్మూర్తిః పూజామూలం గురోఃపరమ్
మంత్రమూలం గురోర్వాక్యం మోక్షమూలం గురోఃకృపా॥

## విజయదశమి (దసరా పండుగ) రోజున శమీవృక్షమును దర్శించినపుడు

శమీ శమయతే పాపం-శమీ శత్రు వినాశినీ
అర్జునస్య ధనుర్ధారీ-రామస్య ప్రియదర్శినీ॥



## శ్రీ లలితా మంగళహారతి -రచయిత : బ్రహ్మశ్రీ చేతవోలు రామబ్రహ్మం

శీతాద్రి శిఖరాన పగడాలు తాపించు
మాతల్లి లత్తుకకు నీరాజనం-కెంపైన నీరాజనం
భక్తి పెంపైన నీరాజనం
యోగీంద్ర హృదయాల మ్రోగేటి మా తల్లి
బాగైన అందెలకు నీరాజనం-బంగారు నీరాజనం
భక్తి పొంగారు నీరాజనం
నెలతాల్పు డెందాన పలపు వీణలు మీటు
మా తల్లి గాజులకు నీరాజనం-రాగాల నీరాజనం
భక్తి తాళాల నీరాజనం
మనుజాళి హృదయాల తిమిరాలు సమయించు
మా తల్లి నవ్వులకు నీరాజనం-ముత్యాల నీరాజనం
భక్తి నృత్యాల నీరాజనం
చెక్కిళ్ళ కాంతితో క్రిక్కిరిసి అలరారు
మా తల్లి ముంగరకు నీరాజనం-రతనాల నీరాజనం
భక్తి జతనాల నీరాజనం
పసిబిడ్డలనుజేసి ప్రజనెల్ల పాలించు
మా తల్లి చూపులకు నీరాజనం-అనురాగ నీరాజనం
భక్తి కనరాగ నీరాజనం
దహరాన కనిపించు ఇనబింబ మనిపించు
మాతల్లి కుంకుమకు నీరాజనం-నిండైన నీరాజనం
భక్తి మెండైననీరాజనం
తేటిపిల్లలవోలె గాలి కల్లలనాడు
మా తల్లి కురులకు నీరాజనం-నీలాల నీరాజనం
భక్తి భావాల నీరాజనం
జగదేక మోహిని,సర్వేశగేహిని
మా తల్లి రూపునకు నీరాజనం-నిలువెత్తునీరాజనం
భక్తి విలువెత్తు నీరాజనం

## మణిద్వీపవాసినికి - మంగళహారతి

మంగళమ్ శ్రీ త్రిపుర సుందరికి మణిద్వీపవాసినికి
మంగళమ్ జయమంగళమ్ నిత్య శుభమంగళమ్
ఓంకార రూపిణికి హ్రీంకార వాసినికి
శ్రీం బీజవాహినికి మంగళమ్ జయమంగళమ్
నిత్య శుభమంగళమ్ ఆపదలు బాపేటి
సంపదలనొసగేటి శ్రీనగరవాసినికి
మంగళమ్ జయమంగళమ్ నిత్య శుభమంగళమ్
వేదాలు నాదాలు శిరసొంచి మొక్కేటి
శ్రీరత్నసింహాసినికి మంగళమ్
జయమంగళమ్ నిత్య శుభమంగళమ్

---

ఇంటినుండి బయటకు వెళ్ళేటప్పుడు-తిరిగి ఇంట్లోకి వచ్చేటప్పుడు ఒక్కసారి ఈ శ్లోకం చదవండి !

ఆపదామపహర్తారం దాతారం సర్వ సంపదాం ।
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహం॥